తెలుగు సేత : స్వామి చిరంతనానంద

రామకృష్ణ మఠం
దోమలగూడ, హైదరాబాదు - 500 029

# విజ్ఞప్తి

శ్రీరామకృష్ణ బోధామృతం సర్వవేదాంత సారామృతం. "Sayings of Sri Ramakrishna" అనే గ్రంథానికి అనువాదమైన ఈ పుస్తకం ఈ మలికూర్పులో చక్కగా సంశోధింపబడింది. అంతేగాక విపులీకరింప బడింది. తొలికూర్పులో పునరుక్తమైన 68 ఉపదేశాలు ఇందులో తొలగింపబడి వాటి తావున కొత్తవి చేర్పబడటమేకాక, ఇంచుమించుగా నూటయిరవై ఉపదేశరత్నాలు పది పన్నెండు పునరుక్తమైనవి ఇంకా నిలిచివున్నా మొత్తంమీద ప్రస్తుత ముద్రణలో 1121 మహోపదేశాలు చోటుచేసుకున్నాయి. ఎనభైకి మించినవి నీతికథారత్నాలు. ఈ దివ్యోపదేశాలన్నీ అత్యంత ప్రమాణభూతాలైన మూలగ్రంథాల నుంచి ఏర్చి కూర్చినవి. స్వామి శారదానంద రచించిన 'శ్రీరామకృష్ణ లీలా ప్రసంగ ' (Sri Ramakrishna - the Great Master), "'
' మ 'అనే మహనీయుడు రచించిన శ్రీరామకృష్ణ ' (The Gospel of Sri Ramakrishna), స్వామి బ్రహ్మానంద వెలువరించిన 'శ్రీ శ్రీరామకృష్ణోపదేశాలు' (Words of the Master) అనేవి* ఇందు ప్రధానాలు.

*ఇందు కొన్ని ఆంగ్లగ్రంథాలు, కొన్ని వంగ గ్రంథాలు. ఆంగ్లభాషలో మొదట 1898వ సంవత్సరంలో మాక్స్ ముల్లర్ పండితుడు (Prof. Max Muller) 'Ramakrishna, His Life and Sayings' (శ్రీరామకృష్ణ జీవితం, ఉపదేశాలు) అనే గ్రంథాన్ని రచించి, ప్రకటించివున్నాడు. ఇంచుమించుగా నాటి నుండి శ్రీరామకృష్ణ జీవితోపదేశ సౌరభం వివిధ భాషల్లో జగద్వ్యాప్తం కానారంభించింది.

వాటిమాతృకలు వంగభాషలోనివి. ప్రామాణికాలైన ఈ కింది గ్రంథాలతో కూడ మూలగ్రంథం సరిచూడబడివుంది. 1. సురేశచంద్రదత్త రచించిన 'శ్రీ శ్రీ రామకృష్ణర్ ఉపదేశ' (శ్రీరామకృష్ణోపదేశాలు), 2. రామచంద్రదత్త రచించిన 'శ్రీరామకృష్ణర్ జీవని ఒ ఉపదేశ' (శ్రీరామకృష్ణ జీవితం, ఉపదేశాలు), శ్రీరామకృష్ణుల జీవితకాలంలో (1884వ సం||లో) దీన్లోని మొదటి గ్రంథం ప్రకటింపబడి వుండటం గమనార్హం.

కొత్తవిషయాలను చేర్చటమేకాక, మానవుడి ఆత్మవికాస క్రమాన్ని అనుసరిస్తూ, నూతనవిధానంలో బోధనలను ఇందులో పొందుపరిచి ఉన్నాం. గురుదేవుడి బోధనల్లోని మూలతత్త్వాలతో సంక్షిప్త జీవితచరిత్ర, స్వవచనాలలో గురుదేవుడి దివ్యానుభావాలను తెలిపే ప్రత్యేక ప్రకరణం, బోధనలను బాగా గ్రహించటానికై తోడ్పడే ఉప శీర్షికలు, ముఖ్యమైన తావుల్లో వేదశాస్త్ర ప్రమాణాలు ఇవి ఈ మలికూర్పుకు ప్రత్యేక లక్షణాలని గ్రహించగలరు.

శ్రీ 'ఎమ్.కె.' అనే వారి ప్రోత్సాహంతో స్వామి తత్త్వానంద చేత అనువదింపబడిన తొలికూర్పు మాకు ఇందు తోడ్పడింది.

సంగ్రహజీవిత చరిత్రతో కూడ శ్రీ గురుదేవుల దివ్యోపదేశాలను సాధ్యమైనంత వరకు సమగ్రంగా తెలిపే ప్రస్తుత గ్రంథం పాఠకుల కెంతో ఉపయుక్తం కాగలదని మా ఆశయం.

చిరంతనానందస్వామి

# పీఠిక

శ్రీరామకృష్ణ వాక్యావళి** తత్త్వరత్నాకరం. సర్వమతాలూ సమస్త శాస్త్రాలూ ఘోషించే మహోత్త మధర్మాలన్నీ జిజ్ఞాసువులకు దీన్లో కరతలామలకం. లౌకికనీతులు, వ్యావహారిక హితోపదేశాలు, పార మార్థిక తత్త్వాలు ఇం దన్యోన్యసామరస్యంతో - అవిరళమైత్రితో ఒప్పుచున్నవని చెప్పతగును. శ్రీరామకృష్ణ వాక్య ప్రతిభ అతిసామాన్య పాఠకుడి దృష్టినిసైతం ఆకట్టుకోగలదనటం అతిశయోక్తి కాబోదు. కేవల పండితులు జీవయాత్రనుగూర్చి మహాద్భుతతత్త్వాలను ఉత్కృష్టధర్మాలను వెల్లడించివుండగా, శ్రీరామకృష్ణుల ఉపదేశాలకూ వీటికి గల భేదమేమి టని మనం వివేచింపవలసివుంది. కేవల శాస్త్రపండితుడైన వ్యక్తి వచనా లెంతటి ప్రతిభావంతాలైనా, ఆధ్యాత్మిక విషయాల్లో ఆతడు సామాన్య మానవుని కంటె అధికుడు గాకుండటంతో - అజ్ఞానాంధకారంలో గోరాడుచునే వుండటంతో - అతడి వచనాలు మనకు ప్రమాణభూతాలు కాజాలవు. కాని శ్రీరామకృష్ణులు అఖండ మేధాసంపదను నిరుపమాన కళాదృష్టిని కలిగివుండటమే కాక, 'దేవుణ్ణి ముఖాముఖిని సందర్శించి వుండటంతో దేవుడితో సంభాషించి వుండటంతో, దైవసాగరంలో ఓలలాడి వుండటంతో ఆయన వాక్యాలు మనకు అఖండ ప్రమాణ పూరితాలు - వేదవాక్యాలు. సాక్షాత్పరమేశ్వరుడినుంచి పొందిన